


సారస్వత ధార్మిక మాసపత్రిక  సం||౪ చందా రు ౨-౮-౦

# విభూతి - విషయసూచిక

చిత్రభాను - పుష్యము

---





సంపాదకులు : పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

పుండ్రము. ౪ Vol. 4.

చిత్రభాను—పుష్యము, సికింద్రాబాద్

25th January 1943, SECUNDERABAD

రేఖ ౬ No. 6

## చందాదారులకు

కొన్ని యనివార్యకారణములవలన ఈ సంచిక ౧౫ దినము లాలస్యముగా వెలువడినది. రామాయణవిశేషములు ముందుసంచికలో పూర్తిగావింపబడును. యుద్ధమునకు పూర్వము నాలుగురూపాయల వెలగల రఫ్ కాగితములరీము నలుబదిరూపాయి లిచ్చినను దుర్లభమైనది. చందాదారులు, అభిమానులును యుద్ధావసర దానముగా 'విభూతికి' కొన్నికొన్ని విరాళములను పంపి అవశ్యముగా తోడ్పడగోరుచున్నాము. —సంపాదకుడు.

## మా దాతలు

- శ్రీ ఆరాధ్యుల మాటయ్యగారు, చామర్లకోట - మహారాజపోషక చందా ౨వ సారి — రు ౧౦౦
- ,, చిగురుపాటి సీతారామయ్యగారు, వల్లూరుపాలెం - కొత్తసహాయక చందా — ౫౦
- ,, చిమిరాల చంద్రశేఖరయ్యగారు, దేవరపల్లి - సహాయకచందా ౨వ సారి — ౩౦
- ,, కంది విశ్వనాథరావుగారు, వకీలు, హైదరాబాద్ - సహాయకచందా మొదటిసారి — ౨౫
- ,, పాళం నారయ్యగారు, వల్లూరుపాలెం - "వైదికశివపూజావిధి" ప్రకటన సహాయము ౧వ సారి — ౧౦౦
- ,, చలవాది కోటయ్యగారి రాచయ్యగారు, వల్లూరుపాలెం - పూర్వవాగ్దానము బాపతు — ౫
- ,, అమరవాది లింగయ్యపటేలుగారు, తిమ్మకపల్లి - ౫౦ రూ॥ల సహాయకచందా వాగ్దానము చేసిరి.

ఈ యుదారచరితులందరు 'విభూతి'మీది ప్రేమవలనను, ధర్మాభిమానమువలనను సహాయమొనర్చి ఈ క్షామ దినములలో కామధేనుతుల్యులైనారు. వీరికి పరమేశ్వరుడు ఇంకను ఆయురారోగ్యసంపదభ్యుదయము ననుగ్రహించుగాక యని కృతజ్ఞతతో సూచించుచున్నాము. —సంపాదకుడు.

## రేణుకవిజయము

గత సంచికలో తెల్పిన ప్రకారము ఈ హృద్యమైన పద్యపురాణము మిక్కిలి చక్కగా ముద్రణమై అందమైన బైండుతో కూడియున్నది. వెల ఒక రూపాయమాత్రమే! ప్రతులు కొలదిగా ముద్రింపబడినవి కావునను, ఈ యుద్ధ సమయమున మరల రెండవమారు ప్రకటింపబడజాలదు. కావునను కావలసినవారు చాల త్వరగా స్వీకరింపవలెను.

## ప్రకటన

కీ. శే. మటికె నాగయ్యగారి భార్యయగు మటికె గౌరవమ్మగారు సికిందరాబాదు నందలి కొత్తబోయిగుడెంలో నున్న 4531, 4532, [illegible]9, నంబర్లుగల ఇండ్లను అమ్ముటకు ప్రయత్నించుచున్నదని మా క్లయింటులును, మటికె నాగయ్య ధర్మనిలయము (నాగేశ్వర ధర్మనిలయము) యొక్క మేనేజింగు ట్రస్టీలును ఐన చిదిరెమఠము వీరభద్రశాస్త్రిగారు మాకు తెలియజేసిరి. పై నుదహరించిన ఇండ్లు అసలు కీర్తిశేషులైన మటికె నాగయ్యగారివి. సదరు నాగయ్యగారు 29-1-1937 తేదీగల తమవిల్లు (వసీయత్ నామా) ద్వారా పై నుదహరించిన ఇండ్లను మటికె నాగయ్య ధర్మనిలయము లేక నాగేశ్వర ధర్మనిలయ మనబడు ఒక ధర్మ సంస్థకు దానముగాయిచ్చి సదరు గౌరవమ్మగారి జీవితాంతము వరకు వాటి కిరాయి అనుభవించు హక్కును మాత్రమే ఇచ్చియుండిరి. అందుచే సమస్త జనులకు తెలియజేయడ మేమనగా సదరు ఇండ్లపై గౌరమ్మగారికి బ్రతికియుండువరకు కిరాయి అనుభవించుటకు మాత్రమే హక్కు కలదనియు, ఆ ఇండ్లను సదరు విల్లుకు విరుద్ధముగా అమ్ముటకుగాని లేక ఇతర విధముగ పరాధీనము చేయుటకుగాని ఆమెకు హక్కు లేదనియు, అట్లు సదరు ఇండ్లు పరాధీనము చేయబడుచో మటికె నాగయ్య ధర్మనిలయము (నాగేశ్వర ధర్మనిలయము) వారు దీనికి బాధ్యులు కారనియు, తెలియజేయ బడుచున్నది. (అట్లు కొన్నవారు నష్టపడుదురని దీని తాత్పర్యము).

సికిందరాబాద్,
31 జనవరి 1943.

ఎన్. ఎస్. రాఘవన్ బి. ఏ., ఎల్. ఎల్. బి.
డి. యన్. అయ్యంగార్ బి. ఏ., ఎల్. ఎల్. బి.
వకీళ్లు, సికింద్రాబాద్.




సారస్వత ధార్మిక మాసపత్రిక

సంపుటము ౪ Vol. 4 | శా ౧౮౬౪ చిత్రభాను - పుష్యమాసము - సికింద్రాబాదు 25th January, 1943, Secunderabad | రేఖ ౬ No 6

చెన్నవెగ్గడ నాగేశ్వరకవికృత

# ద్విపద - సిద్ధాంతశిఖామణి

ఈ చిత్రభాను సంవత్సర ఆషాఢ బ॥ ౧౩ని అకస్మాత్తుగ వరంగలు (ఓరుగల్లు) పురమున గురులింగ జంగమ నిష్ఠాగరిష్ఠులును, వైశ్యరత్నమును అగు శ్రీ కొమరవెల్లి ముసలయ్యగారి ఆతిథ్యమును స్వీకరించు సదవకాశము కల్గినది. ఆ రెండు పూటలలో వారితో ధర్మగోష్ఠియు కొంత శైవగ్రంథాన్వేషణము నెరవేరినది. కొందరి యౌదార్యమువలన కొన్ని గ్రంథములును లభించిన వార్త ఈసంవత్సరపు 'విభూతి' ౧వ సంచిక ౪౭వ పుటలో ప్రచురింపబడినది. కాని అపుడే రెండు ప్రాచీనతాళపత్త్రి గ్రంథములను నిండారు భక్తితో సమర్పించిన శ్రీ బుక్కా శంకరయ్యగారి నామము పొరపాటువలన వదల బడినది. ఆ రెంటిలో నొక ప్రతి చెన్నబసవపురాణ మని తత్కాలము ననే గురుతింపబడెను. రెండవ ప్రతిలోని యాకు లన్నియు అంటుకొని గడ్డగట్టియుండుట వలనను, సన్నని యక్షరము లగుటవలనను, పరిచితమైన కవిత్వము కానందునను అసలు గ్రంథనామమే తెలియక యుదాసీనించి ఇంటికి వచ్చిన పిదప దానిని మా పుస్తకాగారమున భద్రపరచితిని.

మొన్న పుష్య శు॥ ౧ గురువారమున మరల నా తాళపత్రి సంపుటమును విడదీసి; నిండుగా నుండిన ధూళిని దూరము గావించి యెంతయో సంస్కరింపగా నందలి యక్షర కదంబము సన్నని ముత్తియముల వోలె కందమ్ములకు విందును గూర్చ చదివిన కొలదియు

నా కమ్మని కవిత డెందమున కానందమును నంధించుచుండ; కథాసరిత్సాగరములోనిరాజ పుత్త్రిలు నాగలోకమును జేరినట్లు రేణుకా చార్యు లగస్త్యులకు బోధించిన "సిద్ధాంతశిఖా మణి" యను గ్రంథమున కిది యనువాదమని తెలిసి బ్రహ్మానంద సుధానిధిని బ్రవేశించితిని.

ద్విపదలో—

"తగు వీరశైవవిస్తార మార్గంబు
కలిత సిద్ధాంతశిఖామణి యనఁగ
గల దది తెనుఁగింపఁ గలదేని తత్త్వ, -
ధుని, దానికన్న లేదొక్కటి మాకు,
ననుకూల మఖిలవేదాంత సారంబు,
గావున దాక్షిణాత్యానుగతపాకసరణి,
గావింపు మనుడు" అనియును,
"అవధారు దేవ! సిద్ధాంతశైవంబు
వివరించి తెనుఁగున విన్నవించెదను
శ్రీ వీరశైవప్రసిద్ధమార్గంబు
సావధానమునఁ బ్రచారంబు చేసి
కడువేడ్క లిగురొత్తగా నగస్త్యుండు
నడుగుచో ప్రమథగణాధీశ్వరుండు
ఘనుఁడు రేణుకుఁడు హృత్కమల పీఠమున
ననుపమానాంగుని నమ్మహాదేవుఁ
గనుగొని, ప్రార్థన గావించి; నిల్పి
మునుకొని పల్కె నమ్మునిపుంగవునకు"

అనియును ప్రత్యక్షముగా జూచుచు జదువు చున్నను తనివి తీరదయ్యె. ఇది స్వప్నము కాదు కదా యని లోకచర్యల గమ నించుచు సన్నిహితుల బిలిచి చదివి మరల మరల వివరించువరకును నమ్మకము కలుగ దయ్యె. తరువాయి గ్రంథము యొక్క కర్తయు భర్తయు తెలియ వచ్చిరి. దానిని గూడ కవీశ్వరుని వాక్కులతో పాఠకులు విన కుతూహలము గలిగియుందురు!

"సదయుండు లింగాంగసమరసజ్ఞుండు
మహిత నిర్మలుఁడు చిన్మయపరీతుండు
చూపుల కొప్పు తేజోమయం బగుచు
దీపించు సతనికి దివ్యనామంబు
శ్రీ రామలింగ మాశ్రిత కల్పతరువు
ఘోరదుర్విషయదుర్గుణవిదూరుండు
మా యిష్టలింగంబు మానిధానంబు
కాయజాంతకమూర్తి ఘనదయాస్ఫూర్తి
............మల్లమపల్లి సద్వంశ
కరుఁడైన రామలింగయ్య నాజియ్య
కడువేడ్క పెన్నిధి గన్న చందమున,
కనుగొని కన్నుల కరవు దీర్చుచును,
అనుచు దత్పాదపద్మాంగుష్ఠయుగము
కనుగవకును వేడ్కగా నద్దుకొనుచు,
శ్రీశైవపంచాక్షరీమహావిద్య
దేశికుఁడై యుపదేశంబు చేసి
మునుకొని తన్మంత్రమూలంబు దెలియ,
నా నేర్పు లేమిట నాజెమా ననుచు
నతిభక్తి నుతియించి హర్ష ముప్పొంగ
సతతము శ్రీపాదసలిలప్రసాద
ములఁ దృప్తి బొందుచు ముదమున నున్న
ఫలమున నొక కథ పచరించి శైవ
గణముల కానందకరముగా జేసి
మునుకొని సద్గురుమూర్తి కర్పింప
నగు నని తలపోయు నంతలో నతఁడు
... ... ...
వర చెన్న పెగ్గడాన్వయపయోరాశి
అహూఢి నాగేశ్వరాభిధానుండ
... ... ...

ఇది చెన్నవెగడ. నాగేశ్వర రచిత
సదమల శ్రీ వీరశైవ సిద్ధాంత—
... ... ...
లను నేడునుం బ్రథమాశ్వాస మయ్యె."

దీని వలన మల్లముపల్లి రామలింగయ్యారాధ్యులచే శివదీక్ష నొందిన చెన్నవెగడ నాగేశ్వరకవి యీ కృతిని గురుప్రీతిగా విరచించినాడనుట స్పష్టము. చెన్నపెగ్గడ, చెన్నవెగడ యను రెండురూపములను గూడ కవి వాడినాడు. నేటి చెన్నాప్రెగడ యను రూపమును గమనింపదగి యున్నది. ఈ కవి యాత్రేయసగోత్రుడనియును, మల్లమపల్లి వారు తన వంశగురువు లనియును చెప్పి యున్నాడు. ఈ విషయమును ప్రస్తుత వంశస్థులలో నన్వేషించి మున్ముందు గాని విస్తరింప వీలుండదు. ఈ మల్లముపల్లి యను గ్రామము పాలకురికి సోమనాథుని పాలకుర్తికి రెండు మైళ్ళదూరమున నున్నది. మల్లముపల్లి యను ఇంటిపేరు గల తెలుగునాటి యారాధ్యులందరు పూర్వ మీ గ్రామముననే నివసించి యుందురు. ఈ నాగేశ్వర కవియు ఈ నిజాం. ప్రాంతమువాడే అయ్యుండును. క్రీ. శ. 14 లేక 15 వ శతాబ్దివాడు కావచ్చును. ఈతని కవితారీతులు గూడ పై యభిప్రాయమునే బలపరచుచున్నవి.

మాకు దొరకిన తాటాకుప్రతి కొంత జీర్ణమైయున్నది. ౩, ౪ కమ్మలు పూర్తిగ పోయినవి. ౫, ౬ విరిగియున్నవి. ఇంకను కొన్నింటి యంచులును తలలును విరిగి తరిగి కరగి యున్నవి. ౧౧౬ కమ్మలు గలవు. బంతులు ౯, ౮, ౭ ను ప్రతిపత్రమున గలవు. ఐనను మొత్తముమీద గ్రంథమంతయు సురక్షితముగ నున్నట్లే భావింపవలెను. ఐదాశ్వాసములలోనో నాల్గాశ్వాసములలోనో పూర్తి చేయబడినది. ఇది యంతయు చక్కని ద్విపదలో విరచింపబడినది. దీనికి కవి "సిద్ధాంత శైవము" అని నామకరణము గావించినాడు. వీరశైవమునకు సిద్ధాంతశైవమని మారుపేరుండుట వలన కవి యట్లు వ్యవహరించినాడు. అసలు మూలగ్రంథ మగు సిద్ధాంతశిఖామణి యను నామ మందలి సిద్ధాంత శబ్దముగూడ నిట్టిసిద్ధాంతశైవసంకేతమును దెల్పుచున్నది. వామ, దక్షిణ, మిశ్రసిద్ధాంతము లని శైవము చతుర్విధము. వీరశైవమును ప్రత్యేకముగా వివరించువానికి సిద్ధాంతాగమ మని పేరుకలదు. ఈ యాంధ్ర గ్రంథమునకు మాత్రము ద్విపద సిద్ధాంత శిఖామణి యను నామమే గంభీరముగా దోచినది.

వీరశైవమత స్థాపకులలో ప్రధానాచార్యుడైన జగద్గురు శ్రీ రేణుకుని యుపదేశరూప మగు సిద్ధాంత శిఖామణి వీరశైవులలో చిరప్రసిద్ధమైయున్నది. కర్ణాటకాంధ్ర మహారాష్ట్ర దేశములలోని అక్షరాస్యుడైన ప్రతివీర శైవునకును ఇది సుపరిచితము. 15,16,17 శతాబ్దములలో నీ గ్రంథమునకు సంస్కృత కర్ణాటక భాషలలో ఉజ్జయనీశ, సోసలె రేవణారాధ్య, మరితోంటదార్య పండితులు టీకలను విరచించినారు. కాని వీరికంటెను ప్రాచీన కాలముననే ఆంధ్రుడైన చెన్నవెగడ నాగేశ్వర కవి సిద్ధాంత శిఖామణిని ద్విపదగా నాంధ్రీకరించినాడను అమోఘవార్తను మొట్టమొదటి మాకు నూ విభూతియే ప్రకటించుచున్నందులకు సంతసము గలుగుచున్నది.

సిద్ధాంతశిఖామణిని కూడ ఆంధ్రుడైన

కొలనుపాక శివయోగి శివాచార్యుడే విరచించి వ్యాసుడు భగవద్గీతనుబోలె రేణుకాచార్యుని యుపదేశమును లోకమున బచరించినాడు. కావున నాగేశ్వరకవియును తన పూర్వాచార్యుని యడుగు జాడల సంచరించి ధన్యుడైనాడు. ఆంధ్రదేశమున నింకను నెవరియొద్దనైనను దీని వేరొక ప్రతి కలదో లేదో చెప్ప వీలులేదు. మా యొద్దనున్న ప్రతికూడా వేరొక ప్రతినుండి యెత్తి వ్రాయబడినదియె కాని కవి సొంతముగా వ్రాసినదికాదు. వ్రాత తప్పులు మెండుగా గలవు. కొలనుపాక, పాలకురికి, వరంగల్ ప్రాంతములలో ప్రత్యంతరము లభించునేమో అన్వేషణము పరమావశ్యకమై యున్నది. వరంగల్ శైవప్రచారిణి గ్రంథమాలవారు కొన్ని గ్రంథములను అచ్చువేసినారు. అనేకములగు తాళపత్రిగ్రంథములను సేకరించి యుండిరి. ఇట్టి ముఖ్యమైన గ్రంథము వారికి లభించుచో ప్రకటింపక యుదాసీనింతురని భావించుటకు వీలులేదు వారి యూరిలోనే బుక్కావారింట గల గ్రంథరత్నమును ధూళిధూసరిత మగుటవలన గాబోలు గాంచజాలరైరి. ౧౧౬ పత్రములుగల ఈ తాటాకు ప్రతిని ౧౧౬ రూపాయిల నోట్లకట్టవలె శ్రీ బుక్కా శంకరయ్యగారు సత్పాత్రమున సమర్పించి ఆంధ్ర వీరశైవ జగమునకు మహానందమును గలిగించినారు. ఈ గ్రంథమణిని పరంపరగా సంరక్షించుచు వచ్చిన వారి పితృపితామహాదులును, నిరపేక్షతో కేవల శివప్రీతిగ తమ పితార్జితమైన ఈ మహామణిని మాకు స్వాధీనము గావించిన శ్రీ బుక్కా శంకరయ్యగారును తరుగని ధన్యవాదములకు పాత్రులనుట యతిశయము కాదు.

అనువాదపద్ధతి సులభముగా నున్నది. దీని మాదిరి దెలియుటకై మూల సంస్కృతము నుండి కొన్ని శ్లోకములును, దాని యనువాదమగు ద్విపదలోనుండి కొన్ని చరణములను ఈ క్రింద నుదాహరించుచున్నాను.

"అథాగస్త్యవచః శ్రుత్వా రేణుకో గణనాయకః ।
ధ్యాత్వాక్షణం మహాదేవం సాంబ మాహ సమాహితః. ౧
అగస్త్య బహుధా ఖ్యాతాః సిద్ధాంతా రుచిభేదతః,
భిన్నాచార సమాయుక్తా భిన్నార్థప్రతిపాదకాః. ౩
సాంఖ్యంయోగః పాంచరాత్రం వేదాః పాశుపతంతథా
ఏతాని మానభూతాని న హంతవ్యాని యుక్తిభిః. ౪
వేదః ప్రధానం సర్వేషాం సాంఖ్యాదీనాం మహామునే,
వేదానుసరణా దేషాం ప్రమాణమితి నిశ్చితం. ౫
పాంచరాత్రస్య సాంఖ్యస్య యోగస్య చ తథా మునే
వేదైకదేశవర్తిత్వం శైవం వేదమయం మతం. ౬

సిద్ధాంతశిఖామణి పరి. ౫.

"కడు వేడ్కలిగురొత్తగా నగస్త్యుండు
అడుగుచో ప్రమథగణాధీశ్వరుండు
ఘనుడు రేణుకుడు హృత్కమలపీఠమున
ననుపమానాంగుని పమ్మహాదేవు
గనుగొని ప్రార్థన గావించి నిల్పి
మునుకొని పల్కె నమ్మునిపుంగవునకు. ౧
ఇత్తరి మునినాథ యిదె విను మేక
చిత్తంబుతో శైవసిద్ధాంత మహిమ
ఎన్ని మతంబుల నెంత జూచినను
భిన్నమార్గంబుల భిన్నరూపముల
భిన్నసౌఖ్యంబుల భిన్నభావనల
అన్నియు నై చిత్ర్యి మంగీకరించు. ౨
ఐనను కొన్ని వేదానుసారములు
పూని తద్భేద మొప్పగ వివరింతు
మునుసాంఖ్యమును యోగములు పాంచరాత్ర

మును వేదములు శైవముం బ్రిమాణములు
గానుండు హాస్యముల్ గావు యుక్తులకు. ౪
మానుగా సాంఖ్యాది మతము లన్నిటికి
తలఁప వేదంబు ప్రిధాన మూహింపు
సలలిత వేదానుసరణంబు వలన
తక్కిన సాంఖ్యాది తంత్రింబు లెల్ల
మక్కువతోడ ప్రమాణంబు లయ్యె. ౫
కావున సుపిశేషకర మెద్ది యనుచు
భావింప నొక్క యుపాయంబు గలదు
మతము లెన్నైన ప్రిమాణంబు వేద
మతిశయంబుగ పలుమరు వీరశైవ
మతమునఁ దమ పరిమాణంబు గొలది
ప్రితిపాదనము చేసె బహుళ వేదములు
మరియున్న సాంఖ్యాది మతములు మూఁడు
తిరముగా వేదైక దేశవర్తనులు
గావున శైవ మాకార మంతయును
భావింప వేద స్వభావ రూపంబు
మానుగా నా వేదమయము శైవంబు
దీని కేమియును సందేహంబు లేదు. ౬

ద్విపదసిద్ధాంతశిఖామణి, కమ్మ ౭.

అనువాదము ఎంత సులభముగా లలితముఁగా నున్నదో వేరుగా జెప్ప నక్కరలేదు. అచ్చటచ్చట కొంతవిపులముగా తాత్పర్యమువలె మూలాభిప్రాయము వివరింప బడినది. ఈగ్రింథము జనసామాన్యములో ప్రిచారమందుటకు మిక్కిలి తగియున్నది. ఇట్టి మహాత్త్వము గల ద్విపదగ్రింథమును విరచించి నాగేశ్వరకవి తనగురుమూర్తి కర్పించినను తన్మూలమున వీరశైవులకు గొప్ప యుపకారము కలిగినది. ఉపయుక్తమైన గ్రింథమగుటవలన శీఘ్రాతిశీఘ్రిముగ బ్రికటింప వలసియున్నది. అపుడే దీనిని పరిశోధన పురస్సరముగా నెత్తివ్రాయుపని యారంభింపబడినది. త్వరగా ముద్రిణకు సిద్ధము గావింపబడును. పూర్వము శ్రీ అనంతయ్యగారి సాహాయ్యమువలన ప్రకటించిన మూల సిద్ధాంత శిఖామణివలెనే ఈ ద్విపదసిద్ధాంతశిఖామణిని పాకెట్ సైజులో ప్రకటింప వలసి యున్నది. దాదాపుఐదునూర్ల పుటలు కావచ్చును.

'విభూతి' పాఠకులలోను వీరశైవ సోదరులలోను ఈ సంవత్సరము వ్యాపారము వలన కొన్ని వేల రూకలను సంపాదించిన అదృష్టవంతులు కొందరు కలరు. ఒక సంచిలో సగము సాధారణముగ సరిపోవచ్చును. ఔదార్యము వహించి ఇట్టి గ్రంథరత్నమునకు సాహాయ్యమొనర్చుచో పరమేశ్వరుడు సంతసించి వారికి మరియు నెక్కువగా నైశ్వర్యాయురారోగ్యము లనుగ్రహించు ననుటలో సందేహము లేదు. సహాయకుల కీర్తిచంద్రిక దశదిశల చిరముగ వ్యాపించుటయె కాక స్వమతీయులకు నుపకార మపారముఁగ గల్గును. మిక్కిలి ప్రోత్సాహకరముగను పరిణమింప గలదు. యుద్ధ కారణముగా ధరలు పెరిగినందున ముందెపుడో సులభముగా నచ్చు వేసికొనవచ్చునని భావింప వలదు. యుద్ధ మెట్లున్నను మూడు నాలుగు వత్సరముల వరకును ఇట్టి వస్తువుల ధరలు మరల పూర్వస్థితికి రా గలవను ఆశయే లేదు. ఇంత దీర్ఘకాలమున నెన్ని ఘటనలు జరుగునో తెలియదు. ఇట్టి శుభకార్యములను, దానధర్మములను సాధ్యమైనంతవరకు చాలత్వరగా నిర్వహించుటయే వివేకము. మా పాఠకులు తమ తమ శక్తివంచన లేక బంధుమిత్రులతో నాలోచించి సఫలమైన సందేశము నంపుదురని నిరీక్షింపబడుచున్నది.

చిత్రభాను
మకరసంక్రమణము } చి. మ. వీరభద్రశర్మ.

# ఇష్టలింగము, ఈప్సితసిద్ధి

శ్రీ జి. టి. అక్కుల దీక్షితులుగారు

ఇష్టలింగము సకల ఈప్సితములను సిద్ధింప చేయునట్టి శక్తి గలదని తెలిసికొని ధరించుటకు ఇష్టపడిన చిన్మయము. ఇష్టలింగమును ధరించెడి సిద్ధాంతమునకు శక్తివిశిష్టాద్వైతమని పేరు. శక్తి అనగా శక్యతే శక్తిః=దీనిచేత శక్తుడవును అని నిఘంటువునందు చెప్పబడినది. శ్లో. శక్తిమానేవ శక్తః స్యాదశక్తస్స్యాదశక్తిమాన్, శక్తః కరోతి సకల మశక్తః కిం కరిష్యతి॥ (విశేషార్థ ప్రకాశిక) శక్తిగలవాడె శక్తుడు. శక్తిలేనివాడశక్తుడు. శక్తి గలవాడు సర్వమును చేయగలడు. అశక్తుడు ఏమియుచేయజాలడు గాన సకలమును చేయునట్టిది యెయ్యది గలదో దానికి శక్తి power అని అర్థమౌచున్నది. శివాభిన్నమైన యొక శక్తియే సృష్టిస్థితిలయతిరోధాన అనుగ్రహము మొదలగు కార్యము లొనర్చుటకై అనేక విధములుగా విస్తరించియున్నది. అట్టి శక్తుల నిర్ణయమును శ్లో. నవకోట్యస్తు చాముండా భేదాభిన్నా వ్యవస్థితాః, యా కాద్రీ తామసీ శక్తిస్సా చాముండా ప్రకీర్తితా, అష్టాదశ తథాకోట్యో వైష్ణవ్యా భేద ఉచ్యతే, యా సాతు రాజసీశక్తిః పాలనీ సైవ వైష్ణవీ, యా బ్రాహ్మీశక్తిస్సత్త్వస్థా సానంతా వై ప్రకీర్తితా ఏతాసాం సర్వ భేదేషు పృథగేకైకశోధనే, సర్వాసాం భగవాన్రుద్రః సర్వగత్వాత్పతిర్భవేత్ (వరాహపురాణం త్రిశక్తి నిర్ణయ ప్రకరణం) చాముండా అను ముఖ్యనామము గల్గిన శక్తి 9 కోట్లు. వైష్ణవీ అను ముఖ్య నామము గల శక్తి 18 కోట్లు భేదములు గల్గియున్నవి. బ్రాహ్మి యను పేరుగల శక్తి అనేకకోట్ల భేదములు గల్గియున్నది. అనేక కోట్ల సంఖ్యగల శక్తులన్నిటికి శివుడు నియామకుడై యున్నాడు.

శ్లో. లింగం శివ ఇతిజ్ఞేయః పీఠం శక్తి రుదాహృతం. (శివానుభవ సూత్రం) అనేక కోట్ల శక్తులకు మూలమైన చిచ్ఛక్తియే పీఠముగా గలిగియుండునది ఇష్టలింగము. అనంత శక్తియుతమైన ఇష్టలింగమును ఉపాసించుచుండుటచే 'యద్భావం తద్భవతి' అను ఆర్యోక్తిని సర్వశక్తిమంతుడై మానవుడు సర్వసిద్ధులను బొందగలుగుచున్నాడు. శ్లో. సర్వసిద్ధికరం లింగం యచ్చపాషాణ నిర్మితమ్. (పారమేశ్వరాగమము) శిలచే నిర్మింపబడినదైనను ఇష్టలింగము సర్వసిద్ధులను గల్గింపుచున్నది. "అణిమా సిద్ధిశ్చైషా మస్తీతి సిద్ధాః" (కోశం) అణిమ = చిన్నదగుట, మహిమ = గొప్పదగుట, లఘిమ = తేలికయగుట, గరిమ = భారమగుట, ప్రాప్తి = లభ్యమగుట, ప్రాకామ్యము = ఐశ్వర్యము నుబొందుట, ఈశిత్వం= ఇచ్ఛవచ్చినట్లు సంచరింపుచుండుట, వశిత్వం= లోబరచుకొనుట, మొదలగునవి సిద్ధులు, ఇట్టి సిద్ధులెన్నిగలవో వాటిని గల్గించునది ఇష్టలింగము.

సర్వసిద్ధులును గల్గునట్టి విధానమునకు మన ప్రాచీనులు యోగము అని చెప్పియున్నారు. సిద్ధిం పూర్వాభ్యాసయోగతః (స్కాందం) భూతభావ్యా నవేక్షేత యోగేన (మనుస్మృతి) ఇంకను అనేక ప్రమాణములచే సిద్ధి గలుగుటకు యోగాభ్యాసమును జెప్పుచున్నవి. మన ప్రాచీన గ్రంథములలో సాంఖ్యయోగము

అమనస్క, అధ్యాత్మ, శ్రద్ధా, భక్తి, ధ్యాన సాధన, అష్టాంగ, మంత్ర, క్రియా, కర్మ సన్న్యాస, హఠ, లయ, రాజ, శివలింగ మొదలైన అనేక యోగములు చెప్పబడియున్నవి.

వీనిలో లింగయోగము వలననే సర్వసిద్ధులు గలుగుచున్నవి. లింగయోగమునకు ఆగమములయందు లింగాంగసంయోగము శివయోగము అనునామములు గల్గియున్నవి.

శ్లో. లింగాంగీ లింగసత్ప్రాణీ లింగాత్మా లింగమానసః। లింగేంద్రియో లింగభోగీ లింగయోగీ స కథ్యతే (వీరశైవాచార ప్రదీపిక) లింగాంగీ=బాహ్యాభ్యంతరముల యందు ఇష్ట ప్రాణభావ లింగములను ధరించినవాడు, లింగసత్ప్రాణీ= ప్రాణలింగముతో గూడుకొన్నవాడు, లింగాత్మా = ఆత్మస్వరూపమైన భావలింగము నెఱింగినవాడు, లింగమానసః= మనోవాక్కాయ క్రియల యందు త్రిలింగములయందు భక్తిగల్గి యుండువాడు, లింగేంద్రియః = జ్ఞాన కర్మేంద్రియముల యందు ఆచారాది షల్లింగముల భావింపువాడు, లింగభోగీ = లింగాంగ సామరస్యము గల్గి అనుభవించువాడు' లింగయోగీ = లింగయోగియని. కథ్యతే = చెప్పబడుచున్నాడు. లింగయోగము ఆగమాదుల యందు విశేషముగా జెప్పబడియున్నది. శ్లో. అవధూతశ్చ సన్యాసయోగీ పాశుపతశ్శివః। లింగవీరో వీరశైవో మహామాహేశ్వరశ్చసః, పర్యాయ నామాన్యేతాని వీరశైవస్య యోగినః॥ (వీరశైవ ధర్మశిరోమణి) లింగయోగియే వీరశైవుడు.

వీరశైవులందు లింగయోగముచే సర్వసిద్ధులను బొందినవారు అనేకులు గలిగి యుండిరి. నేటికిని గలరు. మనము పాశ్చాత్య వ్యామోహమున దగుల్కొని యున్నందున గొన్ని నిదర్శనముల చూపువరకు నమ్మిక గల్గకుండుట నేటికిమనకు పరిపాటియైయున్నది గనుక లింగ యోగముచే సర్వసిద్ధులు గల్గునను టకు లింగయోగాభ్యాసమును బోలిన రీతులు గల కొన్ని అభ్యాసములను చేసి పాశ్చాత్యులు అద్భుత కార్యములను చేసి చూపునట్టి శక్తి గల్గ చేసుకొన్న వారు గలరు. వారి అభ్యాస విధానమును దెలిసికొన్న లింగ యోగముచే సర్వసిద్ధులు బొందగలరా? అను సంశయము వీడిపోగలదు. అద్భుతకార్యములు చేసి చూపినవారిలో పేర్వడసినవారు అంటోని మెస్మర్ దొరగారు. ఇంకను డాక్టరు మూల్‌పాటుగారు డాక్టరు ఇంతెయి లిగ్‌గారు మొదలగు వారు గలరు. వారితో మెస్మర్ దొరగారు ఆంగ్లేయ భాషలో మెస్మరిజం అను పేరు గల గ్రంథమును వ్రాసియున్నారు. అనంతరము డాక్టరు బ్రెయిడ్‌గారు అట్టివిద్యకే హిప్నాటిజం అని పేరుపెట్టి గ్రంథమును వ్రాసియున్నారు. మెస్మరిజము, హిప్నాటిజము అను విద్యల నభ్యసించి అద్భుతకార్యము లొనర్చి అనుభవమును గడించినవారు. అభ్యాసవిధానమును అన్ని భాషలయందును గ్రంథములు వ్రాయబడి యున్నవి.

Another method of concentration frequently described is to sit passively opposite a disc of light on a dark back-ground, or a disc of black on a light back-ground, and induce a form of self mesmerism. And if that spot or disc does not dance before your eyes, you are in possession of an exceptionally steady brain. Page no. 21. (Mind concentration) By K. T. Anderson.

(సశేషము)




దివ్యవాణి విజయసంచిక: సంపాదకులు శ్రీ చిఫుకుల అప్పయ్యశాస్త్రిగారు, ఇమాంబావివీథి, సికింద్రాబాదు. పుటలు 88, దేశి కాగితములు. ముద్రణము సాధారణము. రాయల్ సైజు. వెల 0-8-0. ఈ వారపత్రికాధిపతులు ప్రతివత్సరమునను విజయదశమిని పురస్కరించుకొని ప్రత్యేకముగ నొక సంచికను ప్రచురించుచున్నారు. ఇందు మొత్తము ౨౦ గద్య పద్య వ్యాసములు కలవు, సూర్యసిద్ధాంతము, శిష్టాచారము, ఆర్షవిద్య, వ్యాసుని సూత్రములు, భావసాహితి, మహాభారతిమహిమ అను వ్యాసములు పండిత నిబద్ధములై బాగుగా నున్నవి. దివ్యవాణిద్వారా శ్రీ శాస్త్రిగారు చేయుచున్న కృషి, ప్రబోధములు సనాతన ధార్మికులకు మిక్కిలి యుపకారకములు. వారిద్దానిని స్వకర్తవ్యముగా నెంచి సాగించుచున్నారు. కావున ప్రశస్తతరమని వేరుగా నభినందింప నవసరము లేదు.

మొదటి వ్యాసమున విషయాంతరములు కలవు, దర్శనములలో పూర్వోత్తర మీమాంసలును, వ్యాఖ్యానములలో శ్రీ శంకర విద్యారణ్య కృతులును తప్ప "తక్కిన వన్నియు హేయము"లని వ్యాసకర్తగా రనుచున్నారు. అసలు సూర్యసిద్ధాంతమన నెద్దియో తద్గ్రంథము లెవ్వియో వివరింపలేదు. వ్యక్తుల గొప్పదనమును బట్టి చెత్తవ్యాసములను వేయరాదు, 'బాబాజీ' అను కథ సనాతనధర్మమునకు విరుద్ధమైనది. కర్మబద్ధులుకూడ అనవసరమైనది. సంచికయంతట సాధారణముగ అచ్చు తప్పులును ముఖ్యముగ సంస్కృత శ్లోకములలో విశేషముగను కలవు. భవిష్యసంచికలలో నిట్టి వానిని సంపాదకులు గమనింప గోరుచున్నాము.

మహాశివరాత్రి: కర్త, భాగవతిము సీతారామశర్మగారు. ప్రకాశకులు. తత్త్వబోధిని గ్రంథమాల, కుమ్మరిగడ్డ, జి. మెదకు. (నిజాం). పు. ౨౦ కార్డ్ వెల 0-8-0. పురాణ ప్రసిద్ధమైన వ్యాధహారిణముల శివరాత్రినాటి కథను, శ్రీ సీ. శర్మగారు పద్యములుగా రచించినారు. శైలి ధారాళముగాను హృద్యముగాను ఉన్నది. కవిగారి ప్రయత్నము ప్రశంసనీయము. ప్రత్యేకమైన ప్రబంధావతారమునకు బూనెద రనుకొందుము. అచ్చును పరిశుద్ధముగా వేయు ముద్రాశాలలు తెలియనందున గాబోలు ఆరుపుటల తప్పుల పట్టిక ఇచ్చినను ఇంకను చాల తప్పులు కలవు. ముందైనను ప్రకాశకులు శ్రద్ధ వహింప గోరెదము.

**Indian Marriage Gazette:** సంపాదకులు కె.ఆర్. హెబ్బర్, 27, ఇబ్రాంజి సాహెబు వీథి, జి.టి. మద్రాసు. పుటలు 24. సం. చం. 3-0-0. సైజు కాగితములు "విభూతి" వలె. ఇదియొక ఆంగ్లమాస పత్రిక. ఇందు వివాహములను గూర్చిన వార్తలు వ్యాసములు ప్రకటింపబడును. ఎట్టివివాహములు ప్రపంచములో జరుగునో తెలిసికొన వలయునన్నచో నిది యొక యద్దము. సగము భాగము ప్రకటనలును కలవు.

"శ్రీ దే. లక్ష్మీనృసింహ కవికృతులు: అయినాపురం. పో. అమలాపురం. జి. గోదావరి. ఈ కవిగారు కలిగుణదర్పణం, శన్యాగమనచరితం. రామస్తవః, శనిస్తోత్రం, దేవతాస్తోత్రరత్నమాలా, రామచరితం, హనుమత్సందేశం. గోపాలచంపూః," అను చిన్ని చిన్ని సంస్కృతపుస్తకములను పంపినారు. వీరు తమ సహజసంస్కృతకవితాధారలో వీనిని విరచించినారు. బాగుగా నున్నవి. ఒక గొప్ప కావ్యమును అనన్యముగ గ్రథించినచో ఇంకను ప్రశస్తముగా నుండగలదు. తప్పులను సరిగా పరిశోధించి ముద్రణములో ఒక పద్ధతి ననుసరింపవలెను.

నా అభిప్రాయములో రామాయణకాలమునకంటె చాల పూర్వమందు ఆర్యావర్తమనిన, కాస్పియన్ సముద్రమునుండి హిందూకుష్ హిమాలయములవరకు ఉత్తర సీమగాను, కాస్పియన్ సముద్రమునకు, పెర్షియన్ గల్ఫునకు మధ్య నున్న అసీరియా బాబిలోనియాలు పశ్చిమసీమగాను, సింధునది తూర్పుసీమగాను, అరేబియన్ సముద్రము దక్షిణసీమగాను కలిగియుండిన ఆ మధ్యప్రదేశ మంతయు ఆర్యావర్తముగా పరిగణింపబడుచుండెను. రామాయణకాలము నాటికే ఆ సీమ పశ్చిమములో తగ్గిపోయెను. అప్పటికే మీడ్ జాతి, మీడియా దేశము వారు (అజామీఢుని సంతతివారు) మరియు ఈరాన్ వారు (పర్షియావారు) ఆర్యులనుండి భిన్నించిరి. తర్వాత పతంజలికాలమునాటికి ఆర్యావర్తపు సీమాంతములు (సరిహద్దులు) ఈ విధముగా నుండెను. పతంజలి పాణినీయ ౬-౩-౧౦౯ సూత్రమగు "పృషోదరాదీని యథోపదిష్టం" అను దానిపై వ్యాఖ్య వ్రాయుచూ ఇట్లు చర్చించినాడు:

" కః పున రార్యావర్తః?

"ప్రాగాదర్శాత్ ప్రత్యక్ కాలకవనాత్, దక్షిణేన హిమవంతం ఉత్తరేణ పారియాత్రం ఏతస్మిన్ ఆర్యావర్తే నివాస, యే బ్రాహ్మణాః కుంభీధాన్యా అలోలుపా అగృహ్యమాణకారణాః కించి దంతరేణ కస్యాశ్చి ద్విద్యాయాః పారంగతాః తత్రభవంతః శిష్టాః.

అనగా ఆర్యావర్తమునకు పశ్చిమమున ఆదర్శపర్వతములును, తూర్పున కాలకవనమున్నూ, ఉత్తరమున హిమాలయమున్నూ, దక్షిణమున పారియాత్రమున్నూ సీమాంతములుగా ఏర్పడియున్నవి. పతంజలి క్రీ. పూర్వము ౨౦౦ నుండి ౩౦౦ ఏండ్ల ప్రాంతమందుండినాడని చెప్పుదురు. కావున నేటికి ౨౨౦౦ ఏండ్ల క్రిందట ఆర్యావర్తమునకు ఒక నిర్ణయమగు భౌగోళికస్వరూప మేర్పడె నని చెప్పవచ్చును. అయితే ఈ ప్రదేశా లేవో మనము నిరూపింపగలమా అనునదే ప్రశ్న. మనుస్మృత్యాదులలోను, కొన్ని పురాణాలలోను ఆర్యావర్తమునుగురించి వర్ణించియున్నారు. పురాణాలు క్రీ. శ. ౧౦ వ శతాబ్దము వరకు పెరుగుచూ వచ్చినందున మన్వాదిధర్మశాస్త్రాలు పరస్పరభిన్నమైనవిగాను మధ్యమధ్య స్వార్థులహస్తలాఘవముచే అందందు తారుమారైనవిగాను ఉండుటచేతను, పతంజలి భాష్యాని కట్టి అవస్థ పట్టుటకు వీలులేనందునను నేను పతంజలినే ఉదహరించినాను. ఇక పతంజలి నిరూపించినసీమ లేవో నిర్ణయింప ప్రయత్నింతము.

నాలుగు హద్దులలో హిమవంతము అను దానిని మాత్రము మః ము తటాలున గుర్తింపగలుగు చున్నాము. అది ఇప్పటి హిమాలయ పర్వతము. అయితే హిమవంతమను పర్వత మింకొకటికూడా ఉండిన ట్లున్నది. మావర్ అను ఇంగ్లీషు గ్రంథకర్తక్రీ శ. ౧౮౧౨ లో తాను ప్రకటించిన గ్రంథములో ఇట్లు వ్రాసెను. "సితియనులు (శకులు)

ఇమాస్ (Imaus) పర్వతమువద్ద నివసించుచుండిరి''.[16] అయితే సుప్రసిద్ధమగు మనహిమవత్పర్వతము మనకు తెలిసినదుండగా ఎక్కడనో శకదేశములో కకేసస్ పర్వతప్రాంతాలవరకు వెళ్ళి అప్రసిద్ధమును అస్పష్టమును అగు ఇమయుస్ లేక ఇమాస్ అనుపర్వతమును ఉదహరించుట ఏల? ఒక కాలములో అంతవరకును ఆర్యావర్తము వ్యాపించియుండుటచేత దానిని సూచించుచు భావి పరిశోధకుల కదియు దృష్టిగో నుండవలె నని వ్రాసినాను. కాని మన పతంజలి చెప్పినది హిమవత్పర్వతరాజమే అని నేను విశ్వసించుచున్నాను. ఇక తూర్పున కాలకవనము ఉన్నదని వ్రాసినారు. అ దెచ్చటిది? సుగ్రీవుడు వానరులకు తూర్పు భూభాగమును సీతాన్వేషణకై వర్ణించునప్పుడు ఇట్లన్నాడు:

"సరస్వతీంచ సింధుంచ శోణం మణినిభోదకం,
మహీం, కాలమహీం చైవ శైలకాననశోభితాం. — కిష్కి. ౪౦-౨౧.

ఇచ్చట నాలుగు పేరులు తెలిపినాడు. సరస్వతీనది, శోణనది, మహియను దేశము, శైలకాననములతో కూడిన కాలమహీ ప్రదేశము. ఇందు సరస్వతీనదిమాత్రము సింధూనది వద్ద నుండునట్టిది. అయోధ్యకు చాలా పడమట నున్నది. శోణనది పాటలీపుత్రమువద్ద అయోధ్యకు తూర్పుదిక్కున గంగతో కలియుచున్నది. కావున పాటలీపుత్రప్రాంతమందే మహీదేశమున్నూ, కాలమహియున్నూ ఉండి యుండును. "కాలమహి'' శైలములతోను అడవులతోను శోభించునట్టి దని వర్ణించినారు. ఈ కాలమహియే పతంజలి చెప్పిన కాలకవన మని నే ననుకొనుచున్నాను. కావున ఆర్యావర్తమునకు పతంజలికాలమునాడు పాటలీపుత్రప్రాంతమందలి కాలకవనము తూర్పు హద్దై యుండెను. రెండు హద్దులను నిర్ణయించినాము. ఇక దక్షిణపు హద్దేదియో కనుగొందము. ఆర్యావర్తమునకు దక్షిణమున పారియాత్రము ఉన్నదని పతంజలి చెప్పెను. అ దెక్కడ నున్నది? శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ మహాభారత విమర్శలో ఇచ్చిన పటమందు పారియాత్రము సింధునదికి పశ్చిమమున పారసీకదేశమును మనదేశమునుండి భిన్నించునట్టి పర్వతపంక్తికి పారియాత్రమని పేరిచ్చినారు. అట్లైతే అది పశ్చిమసీమ యగును. రాధాకుముదముఖర్జీగారు తమ హిందూ సివిలిజేషన్ అను గ్రంథములో ప్రకటించిన పటములో "పారిపాత్ర పర్వతములు'' అని వ్రాసినారు. పారియాత్రకే పారిపాత్రమను పేరు పలుతావుల కనబడుచున్నది. ఆ పర్వతమును వారు వింధ్యకుత్తరముగాను, ఆభీర నిషధ దేశముల మధ్య నుండునదిగాను, సాళ్వదేశమునుండి నిలువుగా నిషధవరకు వ్యాపించినదిగాను చూపించినారు. అదియె సరిగా కనిపించుచున్నది. పారియాత్రము లేక పారిపాత్రము వింధ్యపర్వతాల కుత్తరమున నుండు పర్వతము పేరని ఇతరభూగోళశాస్త్రజ్ఞు లంగీకరించియున్నారు. ఇప్పటికి మూడుహద్దు లయ్యెను. ఇక మిగిలినది పశ్చిమపు

16 Universal History by Mavor (1812)

హద్దు. అదియే నాకు తెలియరానట్టిది. కావున తుదిలో చర్చించుటకై ఆగితిని. దానిని గూడ ఊహతోనైనను ఏదో ఒకటిగా నిర్ణయించి వేయుదము. హిందూస్థాన పశ్చిమ భాగములో అనగా బెలుచిస్థాన సరిహద్దులో గాని కాశ్మీరులో గాని ఆదర్శపర్వతము లెచ్చట నున్నవో పరిశోధకు లెవ్వరును తెలుపలేదు. ఆదర్శ మనునది పర్వతమని "ఆదర్శాదయః పర్వతవిశేషాః" అని టీకలో వ్రాసినారు. అట్టి పర్వత మేదో నాకు కానరాలేదు. పర్షియా (లేక ఈరాన్) దేశములో సీస్థాన్ అను మండల మున్నది. అందు హామూన్ జర్రా అను సరస్సు ఉన్నది. దానిలోనికి హెల్మండ్ అను నది పారును. దాని ఉపనది పేరు అద్రస్కండ్ అను నది కలదు. అనగా ఆదర్శఖండనది. ఈ విషయమును గురించి "గజెటియర్ ఆఫ్ ది వరల్డు" అను గ్రంథములో ఇంచుమించు ౧౨౦ ఏండ్ల క్రిందట వ్రాసినారు.[17] పర్షియా సంబంధమగు ఇతర గ్రంథాలలో ఈ ముచ్చట కానరాదు. ఇదే సరియగునని దైనచో ఆర్యావర్తముయొక్క పశ్చిమహద్దు ఈరాన్‌లోని తూర్పుమండలమును ఆక్రమించుకొనుచున్నది. అది ఆశ్చర్యజనకము కాదు. కన్నింగ్‌హాం వ్రాసిన ఇండియా ప్రాచీన భూగోళము అను నాంగ్లగ్రంథమునకు విపులమగు పీఠిక వ్రాసిన సురేంద్రనాథ మజుందార్ శాస్త్రిగారు కాలకవనమును గురించి, "ఆదర్శ" మును గూర్చియు ఇట్లు వ్రాసినారు.

"వసిష్ఠబౌద్ధాయన సూత్రాలలో ఆర్యావర్తము సరస్వతీనదికి తూర్పునను, కాలకవనమునకు పశ్చిమమునను, పారిపాత్రకు ఉత్తరమునను, హిమాలయమునకు దక్షిణమునను ఉండినట్లు వ్రాసినారు. ఇందుల చిత్రమేమన ఋగ్వేదార్యుల నివాసభూమి యగు బహు భూభాగమును ఈ స్మృతికారులు ఆర్యావర్తమునుండి వదలివేసినారు. ఆదర్శ అనిన ఏమి? బుహ్లర్‌గారు అదర్శన లేక వినశన అనగా సరస్వతి కావున అదే ఆదర్శమై యుండవచ్చును అని ఊహించినారు. ఇది సరిగా కానరాదు............ప్రయాగయే కాలకవన మని నే ననుకొందును........ఆర్యావర్తమునకు పడమటి హద్దు అయిన ఆదర్శము ఎచ్చట నున్నదో ఏ పరిశోధకుడునూ దానిని నిరూపించలేదు. బృహత్సంహితలో (౧౪, ౨౯) యమున, త్రిగర్త మున్నగు వాటితో కూడ ఆదర్శను చెప్పినందున ప్రాచీనశ్రుఘ్న దేశమునకు, త్రిగర్తదేశమునకును (కాంగడాకు) సమీపములో నుండు నని ఊహింపవచ్చును."

ఇక నేను చూపించిన ఆదర్శ మన్నట్టిది ఒకనది. అది హామూన్ జర్రాలోనికి పారును. జర్రా అనిన సరస్సు. పై శాస్త్రిగారు దాని విషయమై యిట్లన్నారు. "సరస్వతిని హరహ్వతి' అని యందురు. అది పర్షియాలోని ఒకనది. సరస్సు కలది కావున సరస్వతి. అది హామూన్ సరస్సులోనికి పారును." అదే సరస్సులోనికి నేను తెలిపిన ఆదర్శఖండనది లేక ఆదర్శకుండనది పారును. ఇది పతంజలినాటిమాట. అశోకుడు ఆఫ్గనిస్థానమును పర్షియాలోని కొంత భాగమును జయించి యుండెను గదా. అందుచేత ఇందు అసంగతము కానరాదు.

17 "Adraskand—Adruskund, a river in Seistan which rises to the N. W. of Ghore and flowing S. S. W. past Subzawive is continued in the Hen Rud river which flows in lake Hamoon Zerrah—Gazetteer of the World, Vol. I

రామాయణకాలముకంటె పూర్వకాలములో ఆర్యజాతి ఒక ప్రసిద్ధజాతియై యుండెను. కేవలము వైదికార్యులే కాక ఈరాన్‌లోని పారసీకులు అనగా జరథుస్త్ర మతానుయాయులుగా నుండిన ఈరానీలు, మీడులు (మీడియావారు) కాషి, కస్సి, కుష్ అను పేరులు గల జాతి, వీ రందరునూ ఆర్యుల మని చెప్పుకొనిరి. ఈ విషయమును గురించి మాక్సుమూలర్ (మోక్షమూల) పండితు డిట్లు వ్రాసెను. "ఆర్యశబ్దము √ అర్ అను ధాతువునుండి ఉత్పన్నమైనది. దానికి వ్యవసాయము చేయుట అని యర్థము. తుర్వసులు (గుర్రములమీద వేగముగా ఎల్లప్పుడు సంచారముచేయు తురాన్ జాతివారు) తమకు భిన్నులని సూచించుటకు ఆర్యు లీ పదమును తమకు ప్రయోగించుకొనిరి. ఆర్య అను పదము జాతివాచకము (a national name). మనుస్మృతిలో ఆర్యభూమి, ఆర్యదేశము అని ఆర్యావర్త పర్యాయపదములుగా వాడబడినవి. జెండు భాషలో ఐర్య (airya) అనగా పూజ్యుడు అని యర్థము. సింధూనది, పర్షియాఖాతము (gulf), హిందూ కుష్ పర్వతము, కాస్పియా సముద్రము, ఈ నాల్గింటి మధ్య నున్న దేశమును స్ట్రాబో (అను ప్రాచీన చరిత్రకారుడు) ఆర్యాణ (Ariana) దేశమని చెప్పెను. అట్టి ఆర్యాణమునకు బాక్ట్రియా (Bactria) తిలకాయమానమగు మండల మనియు చెప్పెను. (క్రీస్తునకుపూర్వము చాలా శతాబ్దములకు ముందుండిన) హెరొడోటస్ కంటె ఇంకనూ పూర్వికుడైన హెల్లానియస్ అనునతడు ఇప్పటి పర్షియాను ఆర్యదేశము (Aria) అని పేర్కొనెను. ఎలమైస్ (Elymais) అను పదము ఐలమ (ailama) నుండియు, అదియు ఐర్యాణనుండియు ఏర్పడెను."[18] ఇంకను మాక్సుమూలర్‌గా రిట్లు వ్రాసిరి. "పారశీకులు, బాక్ట్రియావారు, మీడులు, సగ్దియావారు స్ట్రాబోకాలమువరకు ఒకే భాషను మాట్లాడుచుండిరి. తురాన్ జాతికి వీరు భిన్నులైతా మందరును ఒకే జాతివార మని చెప్పికొనిరి. దరయస్ (ధారా) పర్షియా చక్రవర్తి తన శాసనములలో తాను ఆర్యజాతివాడ నని వ్రాయించుకొనెను. కకేసస్ కనుమలలో ఒసెట్టి (Ossetti) అను జాతి ఆర్యభాషను మాట్లాడుచున్నది. వారు తమను ఐరన్ (Iron) జాతిగా చెప్పుకొనుచున్నారు".[19] మరల పైపండితు డిట్లు వ్రాసినాడు- "కకేసస్ పర్వతాలపాదువునను ఆక్సస్, జక్సార్టీస్ నదులు పారు ప్రాంతాలలోను. ఆర్య, అనార్యజాతులు రెండును కలగలుపు అగుచూ వచ్చెను. తుర్వసుడును, అతని సంతతివారును తురానులైరి. ఆక్సస్ నదికి (పశ్చిమముగా) బహుదూరము వరకును ఆర్యు లుండిరి. హిర్కేనియా ప్రాంతములో అరికీ అనుజాతియు, అంతర్యాని అనునదియు కలవు. జర్క్సీస్ కాలములోని ఒక రాజు అరిపితస్ (ఆర్యపతి) అని వ్యవహరింపబడెను. థ్రేస్ దేశము ఆర్య (Aria) అని పిలువబడుచుండెను. పిశ్చులా నదివద్ద ఒక జర్మను జాతి అరియై (Arii) అని పిలువబడుచుండెను.[20] పంచానన మిత్రగా రిట్లు

18. Maxmuller—Science of Language, Vol. I, P. 294.
19. " " P. 296.
20 M. Muller—Science of Language, Vol I, P. 297

